PTD. BY. A.M. దక్షిణామూర్తి
Cell: 9490406348
SON OF AUTHOR
With Respects and Regards

నేను ఈ శతక ప్రతులను శ్రీరామ
సేవా సమాజము (రిజిష్టర్డు), నానుబాల
శ్రీకాకుళం (పోష్టు & జిల్లా) వారికి బహూక
చితిని. కావున సమాజ నిర్వాహకాధికార
నిర్ణయించిన వెలను చెల్లించి వారినుండి
మహాజనులు ప్రతులను పొందవచ్చును.

— గ్రంథక

శ్రీ శ్రీ శ్రీ

# కూర్మదేవ శతకము



శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముతో ముద్రితమైనది.


గ్రంథకర్త:
అమలాపురపు భాస్కరరావు Ex. MANAGER
నానుబాలవీధి, శ్రీకాకుళము (పోష్టు & జిల్లా) ANDHRA BANK
(ఆం. ప్ర)

శ్రీ శ్రీ శ్రీ

# * కూర్మదేవ శతకము *





శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి
ఆర్థిక సహాయముతో ముద్రితమైనది.

గ్రంథ కర్త:
అమలాపురపు భాస్కరరావు
నానుబాలవీధి, శ్రీకాకుళము (పోష్టు & జిల్లా)
(ఆం. ప్ర)
EX. MANAGER
ANDHRA

***

ప్రథమ ముద్రణము : 17-1-86
1000 ప్రతులు
వెల : అమూల్యము



ముద్రితము :
శ్రీ గాయత్రి ప్రెస్, శ్రీకాకుళం.

శ్రీః

# శ్రీ కూర్మదేవ ప్రభు శతకము

## - పీఠిక -

ఈ శ్రీ కూర్మదేవ ప్రభు శతకమును మత్తేభ శార్దూల వృత్తములలో మదంతే వాసి చిరంజీవి అమలాపురపు భాస్కరరావు మృదు మధుర పద సముదయ ప్రథితమగు మనోజ్ఞ శైలిలో విరచించెను. ఇది ప్రాచీన కవితా సంప్రదాయమును విడువక నవీన మార్గమున వెలసియున్న శతకరాజములలో ప్రధానమైనదని చెప్పవచ్చును.

కావ్యాంగనకు సముచితములగు భూషణములవలె విభాసిల్లు నర్థాలంకార శబ్దాలంకార సముపేత భావపూరిత పద్యములనేకములు హృద్యములై యిందుఁగానవచ్చుచున్నవి.

ఇందలి యాఱవ పద్యము :- శ్రీ శంకరస్వాములవారి భజగోవింద మంజరికా వృత్తములలోని 'శ్లో॥ బాలస్తావత్ క్రీడాసక్తః తరుణస్తావత్ తరుణీసక్తః వృద్ధస్తావచ్చింతాసక్తః పరమే బ్రహ్మణి కోఽపి నసక్తః' అను శ్లోకము నందుంబలె, బాల్యంబది యాటలచేతను, యౌవనము కుసుమ శర సమర విషయాభిలాష చేతను, వార్ధక్యము ధనాశాది గుణబంధనము చేతను సాగించి, దారాపుత్త్రాదిక సమస్త బంధములచే మమకార యుక్తుఁడై సంసార భ్రమణ మొందుచున్న జీవుఁడు నిన్నే సమయమున భజించి ముక్తినొందఁగలఁడని చెప్పుట చక్కని యుపదేశవచనము కనుక సర్వేశ్వరుఁడవైన నన్ను ప్రసన్నుని జేసుకొని తరింపఁగోరుటకై చిన్ననాటనుండియు నీ చరణస్మరణశరణము నవలంబించి వర్తించుటయే కర్తవ్యమని నచించుట హృద్యముగ నున్నది.

10వ పద్యము:— ఆశ్రయించినవారిని రక్షించుట యొక గొప్పకాదు. నీవట్లు విరుద్ధముగా సంచరించువారిని గూడ రక్షించుట నీకుగీర్తిదాయకమని ప్రార్థన రూపమునఁ జెప్పి వానరమిత్రా! వరసారథీ'యను సంబోధనములయందు ధ్వని ప్రధానమగు భావమును వెలయించుట ప్రశంసనీయము.

13వ పద్యము :— 'రెంటికిఁ జెడ్డ రేవఁడు' అను సామెతను రావణ కుంభకర్ణాదులు కయ్యంబు వలనను, సుగ్రీవ విభీషణాదులు నెయ్యంబువలనను నీయందుఁ దలంపు జేర్చి తరించిరి. నీవును వారలకు భేదములేని సమైక్య భావమున నైక్యస్థితిఁ జేకూర్చితివి. శత్రుమిత్రులయందు భేదములేని పవిత్రస్వభావుండవైన నిన్నుగూర్చి నేనేమను కొందును. నెయ్యమునగాని కయ్యమునగాని నీయందు భావమగ్నము చేయకుండుటవలన నే రెంటికిఁ జెడ్డ రేవఁడనని లోకోక్తి నిముడ్చుట ప్రౌఢముగా నున్నది.

18వ పద్యము :— నిన్నెంతఁగాఁ బలవించి పిలుచుచున్నను భక్తుఁడనగు నాయందుఁ గటాక్షించి మాఱుపలుక కుండుటచే నిన్నే భక్తుఁడు మనస్సులో భక్తిపాశములచే బంధించెనో యను పలుకుబ మనోహరముగ నున్నది.

23వ పద్యము :— అంత్యప్రాస శబ్దాలంకారము నిర్విశంకమగు రీతి నొప్పారుచున్నది.

26వ పద్యము .— రామావతార సందర్భమున కోఁతుల మూఁక సాహాయ్యమున నీ కార్యమును సాధించుకొన్నవాఁడవు. నా హృదయమను కోఁతి నిపుడు నీవశ మొనర్చుకొని దాని చపలత్వమును మాన్పి నీ కార్యమును



జక్కదిద్దనలవరింపుమనిచెప్పిన భావము 'శివానందలహరి'లో 'మహామోహాటవ్యాం...' అను శ్లోక భావము జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

37 :— పూర్వ భక్తులగు గజేంద్ర ప్రహ్లాదాదులను బ్రోచినట్లుగ నన్నును రక్షింపుమని స్వామిని ప్రార్థించుట యుచితముగ నున్నది.

43 :— ఓమ్ అను అకార, ఉకార, మకారాత్మక ప్రణవమునుండి ఆకసము, గాలి, యగ్గి, నీరు, పుడమియను నీయైదు మహాభూతములను సృష్టిచేసి, వీని కాధారమైన యోంకార శబ్దస్వరూపమగు బ్రహ్మవే నీవు. సర్వోత్పత్తికి మూలకారణుఁడవు నీవను వేద బుక్కుల భావార్థమును బోధించుట హృదయంగమమై ముద మొదవఁజేయుచున్నది.

44 :— "అహం బ్రహ్మాస్మి" యను మహా వాక్య రహస్యార్థము ప్రవచింపఁబడినది.

45 :— భగవంతుఁడవగు నీయందైక్యమగుటకు పరమ సాధనములై వెలయు సత్త్వగుణ ప్రతిష్ఠితమ్ములగు సద్గుణమ్ముల ననుగ్రహింపుమని వేడుట వేడుకనింపుచున్నది.

46 :— షణ్మతములగు (1) శైవ, 2) వైష్ణవ, (3) సౌర (4) గాణాపత్య, (5) కాపాలిక, (6) శాక్తేయములకు మూలాధారమగు నిర్గుణుఁడవై వెలుఁగుచున్న పరిపూర్ణుఁడ వీవేయని విశదీకరింపఁబడినది.

48 :— నిర్గుణ పరబ్రహ్మమయ్యు రజస్సత్త్వతమో గుణ సంయుక్తిచేఁ గ్రమముగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వర

స్వరూపములను వ్యాపారార్థము ధరించునట్టి జగన్నాటక సూత్రధారివి నీవేయని చెప్పఁబడిన గొప్ప మాట పెద్దల మెప్పులను దప్పక పొందుటకుఁ దగియున్నది.

49 :- వేదాదులే నిను - వర్ణింపలేక "నేతినేతి" యని యూరకున్నవని చెప్పినప్పుడు మూర్ఖుఁడను, నజ్ఞుఁడను నగు నేను నీ యైశ్వర్య స్వరూపము నిదమిత్థమని వచించుటకు నెట్లు సమర్థుఁడనుగాఁగలనో యని జ్ఞానవాంఛా భరితుఁడై భగవంతు నర్చించు తెరువు నెఱుకపఱచుట సరసముగ నున్నది.

50 :- విరివిగ నచ్చ తెనుంగు నుడికారంపు టింపు సొంపులు గుమ్మరింప 'మేటి వేలుపుల మిన్న' యగు తన వేలుపునుగూర్చి బమ్మ కొమరుఁడుగను, అచ్చి యిల్లాలుగను, పలుకుల కలికి కోడలుఁగను నీవుఁ జేకూరుట వలన నిన్ను మన్నన జేసి పెన్నాడు బత్తులకు వరుసగ మనికియు, సిరులును, చదువును జేకూరునుగదా! కాని నీవలన నేమియు జరుగనేరదని వ్యాజస్తుతి ధ్వనించుచున్నది. ఇదిఅర్థాలంకార శోభితము.

58 :- రెండవ యవతారమగు కూర్మదేవుఁడాలయస్థితుఁడై యర్చాదులందఁగలిగి పూజింపఁబడుటకు హేతువులు సూచింపఁబడినవి. అవి యేవన పుణ్యవంతుఁడగు శ్వేత రాజునకు నిజస్వరూప సందర్శనమునొసంగి నీయాజ్ఞను దలఁదాల్చి యాలయ నిర్మాణ కర్తృత్వమును బూని నిన్ను శాస్త్రోక్త విధి ప్రకారము పూజించెనని తెలుపుటయేకాక యటుపిమ్మట నర్వారాయుఁడను రాజవరేణ్యుఁడా దేవునకు భోగరాగాది సమస్త వైభవోపేత కైంకర్యములు నిర్విఘ్నముగ శాశ్వతముగా జరుగుటకై సలుపునంత మాన్యమును



గూడ దానము చేసినట్లు శ్రీ కూర్మక్షేత్ర మాహాత్మ్యమున వివరింపఁబడిన గాథా విషయము లివర్ణ్యంబున హృద్యతర ఫణితి సూచింపఁబడుటచేఁ బాఠకులకు క్షేత్ర నిర్మాణాది విషయ పరిజ్ఞానము కలిగించునుగదా! శ్రీ కూర్మక్షేత్రమున శిలా శాసనమున నర్వారాయ వృత్తాంతము వ్రాయబడినది ఇట్టి విషయములు సర్వులకు పరిగ్రాహ్యములు. ఇది మిక్కిలి సమంజసమై యున్నది.

60 :- మకారాద్యక్షర సమాసములు గురుశిరతము లో నేడు వర్ణముల వఱకు మాత్రము మూఁడు చరణములలో జెప్పఁబడినవి. ఇది చిత్ర కవిత్వమునకుఁ జెందియున్నది.

61 - 70 - 61వ పద్యము మొదలు 70 వరకు నున్న పద్యములలో 'మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః' అను దశావతారములు సముచితముగ వర్ణింపఁ బడినవి. పాఠకులీ పద్యములు నిత్యమును దైవ ప్రార్థనా రూపముగఁ బఠించుకొనుటకు యోగ్యమై యున్నవి.

71 :- నేను, నాది యనునవి లేవని యెఱింగి 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా' అను వేదసూక్తి ననుసరించి సర్వమునందు సర్వోపగతుండవయి సర్వ వస్తు స్వరూపములలో నీవే దీపిల్లుచుండుటచే నన్ను గూడ నీ యధీనమే సర్వమై యున్నప్పుడు నాది యనునది వేఱు లేదు. కాన నీకుఁ భక్తితోఁగానుక సమర్పించుటకు నెట్టి యవకాశము లేకున్నది "శ్రీకరస్వరూపుడవై కృపాసార కాస్వదనంత ప్రతిభావిశ్రాంత కవీశ్వరవై యున్న నిన్ను నిరంతర మెడందను ధ్యానింతు" నను విషయమెంతయును ఉపనిషద్వ్యాఖ్యానుసారియై యున్నది. ఇందు కవికుమారుని యాత్మజ్ఞాన విషయిక గ్రంథ పరిశోధనాధిక్యము తేటతెల్లయగుచున్నది.

73. సర్వంగు పతమ్మున కర్థము పదవాక్యములచేఁ నిది గుహానివల్ల వాడఁబడినది. ఇట్టి భాను తెనుంగు పద ప్రయోగములును, వ్యాత్మ భావోల్లసిత సమాసములును నచ్చటచ్చట కవిచే వాడఁబడియున్నవి. పూర్వ భక్తులైన, యహల్యయు, గుహుఁడును, నాంజనేయుఁడును, జాంబవంతుడును, విభీషణుండునునై నేను జన్మింపక మానవత్వమును బొంది దీనుఁడనై నరాధముఁడనై యున్నవాఁడ నీ పవిత్ర కృపాలేశమును బొందఁగల యవకాశమును గలిగింపుమని ప్రాంగ్యముగఁ బ్రార్థించుట మనోహరముగ నున్నది.

74 :- 'భావాతీతుఁడవై మహిమాత్మ స్వరూపమున సర్వత్ర పరిపూర్ణత్వముచే వెలుంగుచున్న నిన్ను నంటుచితముగు నామదియందు నిల్పి యెట్లు గొలువఁగల" నసాది నిర్వేద సూచకమగు భక్తిరస మీ పద్యమున తొణికిసలాడుచున్నది.

81 :- సర్వదేవతా స్వరూపుఁడవై నీవే విలసిల్లుచున్నాఁడవని చెప్పుటలోఁ గవికిగల పరిపూర్ణమగు విజ్ఞాన స్థితి గోచరించుచున్నది.

84 :- ఊర్ణనాభి విధమునఁ గారణత్రయ కలితుడవై జగత్సృష్టి వ్యాపార సంధాన కర్తవై చోద్యకరమగుచున్నా'వనుట వైష్ణవ సిద్ధాంత ప్రకారము మన్నుపాదాన కారణము, కుమ్మరి నిమిత్త కారణము, కులాల చక్రము దండము సహకారి కారణములుగను సంఘటిల్లి ఘట సంఘటమునకు మూలమగుచున్నది. అట్లే సర్వాత్మలయందును దాను నిండియుండుట యుపాదాన కారణముగను, సృష్టియంతయు నిమిత్త కారణముగను, ప్రకృతి సహకారి



కారణముగను గలిసి యీ కారణత్రయములకు మూలకారణుఁడవై వెలుంగుచున్నాఁడవని విశదపఱచుటచే కృతి కర్త యొక్క వైష్ణవ మత సిద్ధాంత గ్రంథ పరిశోధన విజ్ఞానము తెల్లమగుచున్నది.

86 :- నీ నామామృతమును నిరంతరమును మానసిక తాపములంతరించుటకై భక్తులు గోరుదురు. కావున నట్టి శుభస్థితి నాకును జేకూర్పుమని ప్రార్థించుట సముచిత భక్తి విధానమై యున్నది.

87 :- నిత్యము నా కన్నుల యెదుట నీ మనోహరావయవాంచిత రూపముతోఁ బ్రత్యక్షమగునని వేడుటలో లౌకిక విషయాది దుర్లంపటమును మనస్సునకుఁ జెందక నిత్య నిర్మలత్వము కలుగుటకు హేతువగునని సూచించిన యంతర్భావ మీ పద్యమునఁ బొదిగింపఁబడినది.

94 :- ఇందు సంస్కృత ముకుందమాలయందుఁ జెప్పఁబడినట్లు విభక్తిప్రత్యయములన్నియు వాడఁబడినవి. ఇది చిత్ర కవిత్వ సంప్రదాయము.

95 :- రూపకాలంకారమున సంసారమను సముద్రమును దాటుటకు భక్తియను నావను ప్రసాదింపుమని ప్రార్థించుట మిగుల సమంజసమై యున్నది.

96 :- "అమలాకాంతుననంతు" నను నదియు

97 :- "అమరాధ్యకు" అను నదియు నంత్యప్రాసతో రమణీయముగ నున్నవి.

98:– "శ్రీజోల్లున్ గరుణాలవాల్బు.." అను పదియు నంత్యప్రాసమున జెప్పఁబడి శబ్దాలంకార భూయిష్టమై పాఠకుల హృదయములనానందడోలికల నుఱ్ఱూతలూగించుచున్నదని చెప్పుట యచ్చెరము గాదు.

99 :– ఋకారముతో వృత్త్యను ప్రాసము వ్రాయఁ బడినది.

101, 102 :– పద్యములలో దశావతారములు వ్యంగ్యముగ వర్ణించుట సుమనోమనోహరము.

104 :– ముక్తపదగ్రస్తమున "గధాకవితాబంధూ! యను సమాసమున నేకాక్షర నిఘంటు శబ్దప్రయోగము చేయఁబడినది.

క = బ్రహ్మ, ధా = జ్ఞానము (బ్రహ్మజ్ఞానముతో) కలిత = కూడుకొన్న యోగులకు, బంధూ = బంధువైన వాఁడా అను సంబోధనము చక్కఁగఁ బ్రయోగింపఁబడినది. ఇందు కవి భాషాపటిమ ద్యోతకమగుచున్నది

105:– ఇదియు ముక్తపదగ్రస్తశబ్దాలంకార శోభితము అదితా భాస్కర సూనుఁడైన రాముఁడును గార (కొరా గార) ప్రీణేల విచిత్రోద్భవ వృత్తుఁడైన కృష్ణుఁడును, గూర్మశ్రేష్ఠదేహధారియును శేషఫణితల్పుఁడగు నాది విష్ణువని కవి హృదయము చెప్పిన మత్తేభవృత్తము చక్కని పదగుంభనముతో నలరారుచున్నది.

107 :– కవి జననీ జనకులంగూర్చి చెప్పుకొని తన పితృభక్తిని విశదీకరించుట యోగ్యముగ నున్నది.



109 :– శతక పఠన శ్రవణ ఫలశ్రుతి వివరింపఁబడినది.

ఈ శతకము నాతి కఠిన శైలిలో నిస్తరంగ గైరిక జల ప్రవాహ దోహలప్రక్రియ నలరారుచున్నది. భావమును మెఱుఁగుపెట్టు మృదు మధుర పదప్రయోగమును, పదప్రయోగమును చిక్కఁగ నడిపించు వృత్తశైలియు, వృత్తశైలి శత్యంతానందమును బొందఁగలుగు పాఠక మనస్స్థితియు నిమ్మనోహర శతక రాజమున విస్ఫురితమగుచుండుట రసికులెఱుంగనిది కాదు.

చిరంజీవి అమలాపురపు భాస్కరరావుత్తమ కృతి భూషలచే భాషాయోషనలంకరించుచు దీర్ఘాయురారోగ్య భాగ్య పుత్త్ర, పౌత్ర పరంపరతో వర్ధిల్లుగాతమని యాశీర్వదించుచున్నాఁడను.

ధర్మవరం
(వయా) శ్రీకాకుళం
తే 20–11–1965 దీ.

ఇట్లు
సుధీజన విధేయుఁడు
(సం.) మాడుగుల వేంకట
సూర్య ప్రసాదరావు
భారతీ తీర్థ పండిత, విద్వత్కవి సింహా,
ఆశుకవి చక్రవర్తి, శతావధాని.

—/,—

# సంతృప్తి వచనము

## భగవాన్భక్తి భావనః

సర్వాధారుఁడగు భగవంతుఁడు దయామయుఁడు. అట్టి పరమపురుషునిఁ బొందుటయే మన జీవిత లక్ష్యము - అందు శ్రద్ధలేనివాడు జనన మరణ రూప సంసారపాపమును బొందఁజాలఁడు.

పరమకారుణికుఁడగు భగవానుఁడు సర్వజీవుల సుఖ భోగమునకే పంచభూతాది సృష్టిని గావించెను. ఐహిక సుఖములు మనకుఁగల్గుట కిట్లు సహాయపడుటయేగాక మనకు సంసార బంధ మోక్షమునకై వేదములను సద్గ్రంథములను, సద్గురువులను ప్రసాదించెను.

భాగవతోత్తములు తాము తరించుటచే తృప్తి పడక మనము భగవంతుని సులభముగాఁ జేరుటను గోరుచు భగవదంకితమగు తమ జీవితమును మనకాదర్శము గావించిరి. మఱియు భగవద్గుణ మాహాత్మ్యను బోధించుచు గ్రంథ రచన గావించుచు భక్తి ప్రచారమే తమ ప్రవృత్తిగా నిరూపించిరి. 'పుణ్యానిమాన్స్వరమ భాగవతాన్స్మరామి' అను వాక్యమువలన భగవత్కైంకర్యమునకై భక్తుల స్మరణము కూడ పాపహరము, పుణ్యప్రదమని స్పష్టము.

పుణ్య పాపముల కర్మచే మానవ జన్మము లభించును. కనుక మనము నిత్యము పాపముఁబోఁగొట్టు, పుణ్యము నిచ్చు కర్మలనే చేయుచుండవలెను. ఇద్దానికి నవ విధ భక్తులే మనకు శరణ్యము, దైవ సేవ వలన జ్ఞానము కలుగునని "బోధావిర్భావ నిదానముల్ చదువులయ్యా కావు నీ పాద సంసేవా సక్తియగాక జంతు తతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా!" అను కవి ప్రవచనము చాటుచున్నది. మహా



భక్తుఁడగు పోతన మహాకవియు 'ఏ విభు వందనార్చనము లేవి భుజింతయు నామ కీర్తనం బే విభు లీల లద్భుతము లెవ్వడు సంశ్రవణంబు సేయఁ బాపావళిఁబాసి లోకము శుభాయత వృత్తిఁజెలంగునందు' అని పోతన మనముసకుఁ ముక్తి ప్రాప్తికిని సాధనములఁ జేర్కొనెను.

మఱియు నిస్సార సంసార సముద్రము పాలఁబడిన మన మనస్సులను కారుణ్యమూర్తి పాదపద్మములందాసక్తములగునట్లు చేయు సమర్థములైన దేవదేవుని గుణకీర్తన మహిమాభివర్ణనములతో సంపన్నములగు శతకములను పూర్వకవులే విరచించిరి. సంక్షిప్తములగు శతకములు పాఠకుల మనోబుద్ధులను శీఘ్రముగాఁ ద్రిప్పఁజాలునని మహాత్ముఁడగు భర్తృహరి మనోహరి యగు శతకత్రయముచే నీతి, శృంగార, వైరాగ్యములను వర్ణించెను. ఆంధ్ర వాఙ్మయమందును మహాకవులు వేమన యోగి మొదలగు మహాత్ములు మన హృదయ క్షేత్రమున భక్తి బీజముల నాటుచు ననేక శతకములను వ్రాయ దొడంగిరి. దేశ భాష యగుటచే నవ్వి యెంతటి హృదయములను నాకర్షించినవి. మహాకవి పింగళి సూరన "పాండిత్యంబున నందునందెనుఁగు కబ్బంబద్భుతంబండ్రు" అని శ్లాఘించెను. మహాకవి అప్పయ్య దీక్షితులవారు 'ఆంధ్రత్వమాంధ్రభాషాచనాల్పస్య తపస ఫలమ్' అను వచనముచే నాంధ్రుఁడై జన్మించుటయు నాంధ్ర భాషా పాండిత్యము నెంతో పుణ్యాత్ములకుఁగాని ప్రాప్తింపవని తన ధన్యత్వమును గూర్చి సంతోషించెను. శాస్త్రసారమును సాధన రహస్యములను కైకందించునట్లు మనస్సునకు హత్తునట్లు శతకములు మనకు బోధింప సమర్థములు.

మన పుణ్య వశమున నా పూర్వ విద్యార్థి చిరంజీవి అమలాపురపు భాస్కరరావు "శ్రీ కూర్మ దేవ శతకము"ను వ్రాసి మనకందఁజేసెను. ఇతఁడు బాల్యము నుండియే వైరాగ్యవంతుఁడై దైవభక్తి, పెద్దల సహవాసము, ప్రీతితో విశేషముగలిగి సద్గుణ గ్రహణ పారీణుఁడయ్యెను.

"స్తవ్యః స్తవప్రియః స్తోత్రం" అని విష్ణు సహస్రనామ స్తోత్రమున స్తుతింపఁబడిన తదవతారమయిన శ్రీ కూర్మ క్షేత్రమున వెలసిన శ్రీ కూర్మనాథస్వామివారి శతకమును విరచించి తనకున్న సంపూర్ణ భక్తిని వెల్లడించెను. ఇటు విశిష్టముగా వర్ణింపబడినదై పాఠక మహాశయుల మానస సుమములఁ గూర్మనాథ పాదముల సంసక్తములఁ గావించి దతనుగ్రహ పాత్రములఁ గావించె ననఁగా నతిశయోక్తి గాదు. భగవంతుని మహిమలు, నాతని లీలలు. భగవంతుని శరణు చొచ్చుట, దశావతారములును, గంభీర భావములతో భగవన్మాహాత్మ్యమును పాఠకుల చిత్తమున హత్తుకొనినట్లు చిత్రించెను. ధారాళమగు శైలి మృదుమధుర పదగుంభితమై శ్రావ్యతానుపాకమునఁ గడు రమ్యమై యలరారుచున్నది. వివిధ కవితా లక్షణములతో రహస్యములతోఁ గవితా పిపాసువుల కాప్యాయతఁ గూర్చు పద్యములకూర్పు కడుంగడు ప్రశంసార్హము.

అచంచలమగు దైవభక్తి నెల్లకాలముఁ గలుగ నీతని లేఖిని శతక శతకముల లిఖించి పాఠకులను దరింపఁజేయుటకు నీతనికి, నీతని కుటుంబమునకుఁ జిరాయురారోగ్యైశ్వర్యాది సకల శుభసంపదలను సర్వేశ్వరుఁడు సదా ప్రసాదించుఁగాక.

ఇట్లు,

(సం.) సామవేదము సూర్యనారాయణశాస్త్రి
ఉభయభాషాప్రవీణ, సాహిత్య విద్యాప్రవీణ
శ్రీ సూర్యనారాయణస్వామివారి దేవస్థానము
వైదిక ఆగమ పాఠశాలా సంస్కృత పండితుఁడు,

తే 12-6-1984 దీ. అరసవల్లి.



# అభిప్రాయము.

శ్రీ అమలాపురపు భాస్కరరావుగారు రచించిన శ్రీ కూర్మదేవ శతకమును పరిపూర్ణముగ, విశదముగ పఠించు భాగ్యము నాకు లభించినది. నేను శ్రీకూర్మవాసిని. కమఠేశుఁడు నా యిష్టదైవము. ఆ దేవుని స్తుతి రూపమైన శతకము నను సంధానము గావించునపుడు నాలో కలిగిన యనుభూతి యనిర్వచనీయము.

శ్రీ భాస్కరరావుగారిని నేనింతదనుక కేవలముద్యోగిగానే భావించినాను. ఆయనలో నింతటి భక్తివైరాగ్యములు పెనవేసికొనియున్నవని యూహింపలేదు. భక్తి వైరాగ్య భావములకు కవితాశక్తి జోడగుట సువర్ణమునకు పరిమళ మబ్బుటయైనది. గ్రంథమామూలాగ్రము నిర్దుష్టముగా నుండుట యిందలి విశేషము.

శ్రీ భాస్కరరావుగారిది సహజ పాండిత్యము. ఎద లోతులనుండి యువ్వెత్తుగా లేచిన కవితా తరంగ మమృత తుషారములను నలుదెసల ప్రసరింపఁజేసినది. వీరు వేదాంత శాస్త్రము నధ్యయనము చేసినారో, లేదో తెలియదు కాని వీరి పద్యములలోఁ జాలవఱకు వేదాంత సిద్ధాంతములు ప్రస్ఫుటములుగా వెలసినవి. శ్రీ భాస్కరరావుగారు పరమ భాగవత వర్గమునకుఁ జెందినవారై జన్మ సార్థక్యమును గన్నవారు. ఈ గ్రంథము ముద్రితమై శ్రీ కూర్మనాథుని కంకితమై బహుళ ప్రచారమందునట్లు శ్రీ కూర్మనాథుఁడను గ్రహించు గాక !

ఇట్లు
భక్త విధేయుఁడు

(సం) శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్యులు
ప్రధానాంధ్రోపన్యాసకుఁడు (రిటైర్డు)

తే 2-6-1984 దీ. ప్రభుత్వ కళాశాల, శ్రీకాకుళం.

# ఆమోదము

మిత్రశ్రీ అమలాపురపు భాస్కరరావుగారు రచించిన "శ్రీ కూర్మదేవ" శతకమును ఆమూలాగ్రముగా చదివెడి భాగ్యమబ్బినది, భక్తిభావ బంధురమై మృదు మధుర పద సంకలితమై, రసభరితమైన యీతని కవితాధారలే సవాకమై పులరారుచున్నదని వాకొనుట వాస్తవమెగాని స్తవముగాదు.

నిలువౌ భాష తెలుంగనని యీ రచయిత ప్రాతికొనినను అది యీతని వినయమును అనహంకృతిని తెలియజేయునే గాని భాషాపాటవము లేకపోవుటను సూచింపదు. వేదారణ్యచరన్మ్రేడేభ (8) క్షపిత విఘ్న (10, నొపర్వణ భోగమండము (81) సురధునీవస్త్ర (82) సింహంబు రాకొట్టు తేకువ (87) ఇందీనాయక (93) ఆసాదింపగ జేయవే (95 మొదలగు విశేష పదప్రయోగము లెన్నియో యీతని సంస్కృతాంధ్ర భాషాపరిచయమునకు తార్కాణములు

శతక వాఙ్మయమునకు మకుటాయమానములని చెప్పదగిన శబ్దాలంకారముల కూర్పితని నేర్పును సూచించుచున్నది. (96) అమలాకాంతు వసంత, 97 అమరాధ్య విరించి శంభునుత పాదాంభోజ, (8) శ్రీలోలున కరుణాలవాలు మొదలగు వానియందంత్యానుప్రాసము, (104) వరకారుణ్యనిధీ! నిధీశళత సంపద్భవ్య, (105) అవితాహస్కర సూన! సూనచయ కాండాకార! మొదలగువానియందు ముక్తపదగ్రస్తము ఇందుకు తార్కాణములు.

శ్రీ భాస్కరరావుగారు ఇతోధికమైన కావ్య కుసుమ మాలికలనుగూర్చి, ఆంధ్ర భాషా సరస్వతి నలంకరింప శ్రీ కూర్మనాథుని కృపాకటాక్ష వీక్షణామృత వృష్టిందనిసి సంపూర్ణాయురారోగ్య భోగభాగ్యములనందుగాత!

శ్రీ కాకుళము } ఇట్లు,
10-6-84. } (సం.) విద్వాన్ చిలకా వేంకట
కృష్ణదాసు, B. A.,



# శ్రీ శివ శరణమ్

"శ్రీ కూర్మదేవ ప్రభూ" అను మకుటముతో తాము రచించిన శతకమును మిత్రులు శ్రీ అమలాపురపు భాస్కరరావుగారు నాకొసంగగా సమగ్రముగ చదివి ఆనందించితిని.

శ్రీ భాస్కరరావుగారు ఆంధ్రా బ్యాంకు ఉద్యోగిగ పనిచేయుచున్నను, ఆంధ్ర ప్రబంధాద్యనుశీలనము వీరి వ్యావృత్తి. వినయభూషణులు, వివేకవంతులునగు వీరి లేఖినినుండి జాలువారిన ప్రథమ రచన భక్తిభావబంధురమైన శ్రీ కూర్మదేవప్రభు శతకము.

భగవద్దత్తమగు వాణిని భగవానునకు సమర్పించి పునీతులైన పూర్వ కవీంద్రుల మార్గమును స్వీకరించిన రచయిత ధన్యులు. చదువఁజదువ చవులూరించు శ్రీ కూర్మదేవస్తుతి రూపమగు నీ శతకము రచించి ఆంధ్రావళి మోదమునందునట్లొనర్చిన వీరికి శ్రీ కూర్మదేవుఁడనామయాయుష్యమును ప్రసాదించి అనుగ్రహించుగాత!

శ్రీ కాకుళము, } భాగవత విధేయుఁడు,
రక్తాక్షి ఆషాఢ } (సం.) ఆరవెల్లి లక్ష్మీనారాయ
కృష్ణ ద్వితీయా. } ణాచార్యులు,
భాషాప్రవీణ.

—/—

పండిత ఆదిభట్ల వేంకటరమణ, శ్రీకాకుళము.
జిల్లా రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ విద్యా సరంగదోలా వీధి
విశిష్ట సేవా బహుమతి గ్రహీత. 10-1-86
A. I. R. ఆర్టిస్టు
జిల్లా సంఘ సభ్యుడు - అధికార భాషా సంఘం
జిల్లా సంఘ సభ్యుడు — వయోజన విద్య
జిల్లా సంఘ సభ్యుడు — సాంస్కృతిక వ్యవహారాల మండలి.

## ప్రశంసించడం కాదు ఆశీర్వదించడం.

పద్యం వ్రాస్తే పాపంగా తలచే పసివాళ్ళు ప్రబలుచున్న యీ రోజుల్లో రసబంధురంగా. ఛందస్సుందరంగా పద్యం అల్లేవారిని చూస్తే కాస్త ఊరటగా ఉంటుంది మనస్సుకి.

ఈ పద్యం చూడండి. కమ్మచ్చులో సాగిన తీగలాగ ఎంత హుందాగా అందాలొలికించుకొందో —

మ॥ అజఘాలాక్ష సురేంద్ర సన్నుత
కృపావ్యాపార ! ధీసార ! శి
ష్టజనోద్ధార ! మనోవిహార ! సురభిత్సంహార !
సర్వం సహా
సృజనాధార ... ... ... ... ... 23

శ్రీ అమలాపురపు భాస్కరరావు రచించిన శ్రీ కూర్మదేవ శతకంలో మచ్చు పద్యం. ఇలాగే సాగేయి వారి శార్దూలాలు, మత్తేభాలు.

అష్టోత్తర శత వృత్త రచనా వైదుష్యంతో నసాగి పద్యాలు శ్రీ కూర్మనాథ మంత్ర నామాలే.



శా॥ ఏ పాదాంబురుహంబులన్ భవుఁడు వాగీశుండు
సేవింతురో
పాపంబాఁడ్ప సమర్థమై పరగునా స్వర్వాహినీ ధన్యతా
నే సత్కంజములన్ జనించెఁ దొలుతన్ గృష్ణా
రమానాథ ! యా
నీ పాదాంబుజ యుగ్మమున్ గొలిచెదన్
శ్రీ కూర్మదేవ ప్రభూ ! 17

ఇది నిజంగా భగవత్కైంకర్యానికి జీవుని ఆవేదన ఈ కవి మంచి భక్తి భావ భరితులు. అన్ని పద్యాలు దీనికి నిదర్శనాలే ! "ఏది సత్యంబో విశుద్ధమేదో" అన్న (74) పద్యం కవిగారి శుద్ధజ్ఞాన తత్త్వానికి అద్దం పట్టేది, "శిలనేఁ గాను - సరంగుఁగాను" అనే (72) పద్యంలో అహల్య, గుహ, ఆంజనేయ, జాంబవంత, విభీషణాది భక్తుల కోవకు చేరను. పాప జాతి నరాధములలో పుట్టేను. అయినా త్వత్కృపాలేశం ఎలా చిందిస్తావో అన్న భక్తినివేదన, దాసతాబుద్ధి, కవి పరిణతికి నిదర్శనాలు.

వీరు లోగడ శ్రీ కులశేఖ రాళ్వారు సంస్కృతంలో రచించిన ముకుందమాలను సుందరంగా తెనుగు చేసేరు. సౌందర్యలహరి ఎందరో తెనిగించేరు. శివ మహిమ్నం, శివానందలహరి, ఆనందలహరి తెనిగిస్తే నిజంగా ధన్యులు అవుతారు.

శ్రీ కూర్మనాథ దయాప్రాప్తి వీరికి కలుగుగాక !

ఇట్లు,
భక్తజన విధేయుడు
(సం.) ఏ. వి. రమణ.

డా॥ దూళిపాళ శివరామమూర్తి
ఆంధ్రోపన్యాసకుడు
ప్రభుత్వ కళాశాల, శ్రీకాకుళము.

శ్రీకాకుళము
తే 12-1-86 దీ

## ప్రశంస.

వృత్తి రీత్యా అమలాపురపు భాస్కరరావుగారు ఆర్థిక సంస్థలో ఉద్యోగి, ప్రవృత్తి రీత్యా కవులు. కానిచో ఈ శతకము వ్రాయుట సాధ్యము కాదు. త్రిమతాచార్యుల రాకతో పవిత్రమైన శ్రీ కూర్మక్షేత్రములో వెలసియున్న శ్రీ కూర్మనాథస్వామి వారిపై శతకము వ్రాయుట వారి అభిరుచికి తార్కాణము. భాస్కరరావుగారు భావుకులు, సరసులు, సత్కవితాధురీణులు. మొదటి పద్యమునుండి చివరి పద్యము వరకు ఒకే రీతిలో రచన సాగించుటచే వీరిని చేయి తిరిగిన కవిగా పేర్కొనవచ్చును. వీరి శైలి సంస్కృత సమాస భూయిష్ఠమై, ధారాశుద్ధి కల్గది.

ధారాశుద్ధికొక మచ్చుతునక —

"జలజాతాసన సన్నుతా" ...... (40) సంస్కృత సమాసములను అలవోకగా కూర్పగలరు.

"అజఫాలాక్ష సురేంద్ర సన్నుత" ........ (23)

భక్తిరసప్రధానమైన శ్రీ కూర్మదేవ శతకము ఆస్తికుల కవశ్య పఠనీయము. ఆంధ్రలోకమునందలి సరసులు ఈ శతకమును పఠించి, ఇతోధికముగా గ్రంథ రచన చేయుటకు భాస్కరరావుగారికి చేయూత నివ్వగలరు.

ఇట్లు,
(సం.) దూ॥ శివరామమూర్తి.
12—1—86.



భక్త మహాజనులకు:

## — విజ్ఞాపనము —

సీ॥ గోపాలశతకంబుఁ గూర్చినాడను గంధ
పద్యములను నాదు బాల్యమందు
శ్రీ కూర్మవిభునిఁ బ్రార్థించుచుఁ జేసితి
శతకంబు నొందుఁ బ్రసన్నరీతిఁ
గూర్చితి నాంధ్ర ముకుందమాలను భక్తిఁ
గోవిదుల్ మెచ్చ ముకుందు కరుణ
విరచించినాడను పెక్కు పద్యములను
వివిధ విషయములన్ వెల్లడించి

తే॥ గీ॥ మాడుగులాన్వయ సన్మణి, మహిత సుకవి
యగు ప్రసాదరాయ గురుదయాప్తి చేత
సుమతి, నమలాపురపు వంశజుండ ధరణి
భాస్కరాఖ్యుఁడన్, గురుభక్తిఁ బావనుండ॥

నేను శ్రీ కూర్మదేవ శతక రచనమును శ్రీ కూర్మదేవుని యనుగ్రహ విశేషము చేతను, నా కవితా గురుదేవులగు కీ॥ శే॥ కనకాభిషేక సన్మాని శ్రీ మాడుగుల వేంకట సూర్య ప్రసాదరాయ శతావధాని (మాజీ జమీందారు) గారి యొక్కయు, కీ॥ శే॥ మహాకవి శ్రీ సోమంచి వాసుదేవ రావు పంతులుగారి యొక్కయు నాశీర్వచన ప్రభావమున్నను తే 1-8-1965 దీని సంపూర్ణముఁగావించితిని. ఆ మహనీయుల సవినత శిరస్కుఁడనై సంస్మరించుకొనుచున్నాఁడను. కార్యాంతరాసక్తుఁడ నగుటచే నీశతక ముద్రణ విషయమై యింతవఱకు శ్రద్ధవహింపలేకుంటిని. ఇపుడు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన ద్రవ్య సాహాయ్యమున నీ శతకము ముద్రణ భాగ్యము నొందినది. నాకిట్టి యుపకృతి యొనర్చిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థాన కార్యనిర్వహణాధికారులకు నెంతయుఁ గృతజ్ఞుఁడను.

ఆధ్యాత్మిక విద్యయందు నాకు గురుదేవులగు శ్రీ శ్రీ బ్రహ్మశ్రీ వేదమూర్తులు సరిదేవి సూర్యనారాయణాచార్యుల వారి కృప వలనను, నా పెద్ద మేనమామ కుమారుఁడును, బ్రహ్మవిద్యా పారంగతుఁడును, ఆయుర్వేద విద్యా నిష్ణాతుఁడును, శ్రీ దండా నరసింహ కవీశ్వర కృతమగు "పరతత్త్వ పదార్థ నిఘంటువు"నకుఁ గృతి భర్తయు నగు డాక్టర్ రామవరపు చంగలరావుగారి కరుణవలనను నేను నేర్చుకొనిన వేదాంత విషయములను, భక్తిమార్గములను నేనీ శతకమునఁ బొందు పఱచితిని. ఏలిన్మహాత్ములకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కృతుల నర్పించుచున్నాఁడను.

అల్పజ్ఞుఁడ నయ్యును శ్రీ కూర్మదేవుని యందలి భక్త్యావేశముచే నీ శతకము రచించితిని గాన నిందలి దోషములకు నన్ను క్షమింపఁ గృపాస్వాంతులగు పండితులను బ్రార్థించుచున్నాఁడను.

నాయందలి యవ్యాజమగు కరుణతోఁ బండితాభిప్రాయముల నొసంగిన బ్రహ్మశ్రీ వేదమూర్తులు సామవేదము సూర్యనారాయణశాస్త్రి గురువుగారికి (నాకున్నత పాఠశాలలో నుపాధ్యాయులు), శ్రీమాన్ శ్రీ భాష్యం తిరుమల రామానుజాచార్యులు వారికి, శ్రీమాన్ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు వారికి, మహారాజశ్రీ చిలకా వేంకట కృష్ణబాబు గారికి, పండిత ఆదిభట్ల వేంకటరమణగారికి, డాక్టర్ ధూళిపాళ శివరామమూర్తి గారికి నా కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుకొనుచున్నాఁడను.

ఈ శతకము నతి సుందరముగా ముద్రించి యిచ్చిన శ్రీ గాయత్రీ ప్రెస్, శ్రీకాకుళం వారిని నేనెంతయు నభినందించుచున్నాఁడను.

నానుబాలవీధి,
శ్రీకాకుళము.
9–1–1986.

ఇట్లు
సుధీ విధేయుఁడు
అమలాపురపు భాస్కరరావు
గ్రంథకర్త.



# శ్రీ శ్రీ శ్రీ కూర్మదేవ శతకము

శా॥ శ్రీలన్ దన్పుచు శిష్టరాజిఁ బరిర
క్షింపన్ గృపాపాథిమైఁ
గ్రాలన్ గచ్ఛపమూర్తి దివ్యగతిఁ గూ
ర్మక్షేత్ర రాజంబునన్
లీల శోభిల్లు శౌరి నిన్నుఁబరునిన్
నీరేజనాభున్ రమా
లోలు గొల్చెద భక్తకల్ప! కరుణా
భూ! కూర్మదేవ ప్రభూ!

మ॥ నలువౌ భాష దెలుంగ, వ్యాకరణమున్
సాకల్యమున్నేర్వఁబో
నలమిన్ ద్వత్పద భక్తి నన్ను స్థిరమై
యెంతేనిఁ బ్రేరేపనీ
యులఘు ప్రౌఢి నుతించు వృత్తశతక
ప్రారంభముం జేసితిన్
లలి నీవెట్లు రచింపఁ జేయుదొ! గుణా
ఢ్యా! కూర్మదేవ ప్రభూ!

శా॥ ఆదిన్ బోతన గోపనాది కవిహం
సానీకముల్ భక్తి యా
పాదిల్లన్ గమనీయ కావ్యములుగాఁ
ద్వల్లీలలన్ గూర్చి ర
మ్యామోదస్వాంతులఁ గొల్తు సమ్మది సత
త్త్వమ్మున్ భారతీ సిద్ధికై
వేదారణ్య చరన్మదేభ ! కరుణా
బ్ధీ! కూర్మదేవ ప్రభూ ! 3

శా॥ స్వామ్యాన్వ్యూఢతగు నట్టి యాతఁడు నృపా
స్థానమ్మునన్ బల్కఁగా
నేమమ్ముల్ దెల్లియుండటన్న నకటా !
నేమూఢ చిత్తుండ నో
స్వామీ ! యీవు జగత్త్రయాధిపుఁడవున్
భాషింపఁగా నేర్తునే
ధీమెప్పుల్ దగఁ బొందురీతి యలరన్
శ్రీ కూర్మదేవ ప్రభూ ! 4

శా॥ ఏ వేదాళిఁ బఠింప లేదొగిఁ గటా !
యే నేర్వ శాస్త్రమ్ములన్,
సేవింపన్ బుధరాజి నోజ, వెడలన్
క్షేత్రంబులన్ గొల్వఁగా
దేవా ! త్వత్కృప నెట్లు పొందఁగలనో
తెల్పంగ లేనిస్సి ! నన్
గావన్ భారము నీదె సుమ్మి, శ్రితసం
గా ! కూర్మదేవ ప్రభూ ! 5



మ॥ ధర, బాల్యమ్మున నగ్రిడలన్ దంత్రాలు, గారా
[illegible] పోటుఁడై చౌకు వే
మరు మత్త్యం [illegible] జవ్వనమ్మున, జరా
మగ్నుండుగా నుండి వే
సరు నత్యాశను జింతలన్ మునుఁగుచున్
సర్వేశ ! యుక్షాట నీ
కరుణన్ గాక తరించు టెట్టులి ? శుభాం
గా ! కూర్మదేవ ప్రభూ ! 6

మ॥ తగనిన్ జెప్పఁగఁ జాల వాగమములున్
దర్థ్వంబు, శేషుండు దాఁ
బొగడన్నేరఁడు నిన్ను లెస్సఁగ స్వయం
భూ! పద్మజుండేనియు
న్నగజా వల్లభుఁడైనఁగాని నెఱయన్
వర్ణింపలేరన్న నే
పగిదిన్ స్తోత్రము చేయువాఁడ నిను ! దే
వా ! కూర్మదేవ ప్రభూ ! 7

మ॥ సిరి పత్కంజము లొత్తుచున్ వలపుమై
సేవించు చుండంగ నిన్
బొరిదిన్ దుంబుర నారదాదిమునులున్
స్తోత్రింప సంగీత వై
ఖరి భక్త్యున్నతి నిచ్చలున్ రసవాహం
గన్, విన్పు గారాగిల్లు తం
దర [illegible]
[illegible] కూర్మదేవ ప్రభూ! 8

శా॥ నీ నాభీ కమలంబునన్ బొడమ వా
ణీ జాని లోకమ్ముల
న్నానారీతుల సృష్టిచేయు విలస
న్నైపుణ్య మేపార, దే
వా ! నీ పజ్జలజమ్మువన్ బొదలుఁ బా
ప ధ్వంసకృద్గంగ, నా,
నేనీప్రజ్ఞ నెఱుంగ నౌనె సరవిన్
శ్రీ కూర్మదేవప్రభూ ! 9

మ॥ కరుణావార్ధి వటంచు నించు బిరుదున్
గైకొంటి వీవాస్థఁ ద్వ
చ్చరణ ద్వంద్వము వీడఁబోని ఘనుల
సాఁ కంగనే నీకుఁ జే
కురునే కీర్తి? ననున్ వినింద్యమతి మూ
ర్ఖున్ బ్రోచినంగాక ! వా
నర మిత్రా ! నరసారథీ ! క్షపిత వి
ఘ్నా ! కూర్మదేవ ప్రభూ ! 10

మ॥ గిరిధారీ ! హరి ! క్రూరరాక్షసుల శి
క్షింపంగ నంకించు నో
కరినాథావన ! మన్మనస్థ్సలిని వీఁ
కన్ జేరి దర్పించు నా
యరిషడ్వర్గ నరాదులన్ దునుమవే !
హర్షప్రకర్షుండనై
చరియింతున్ ధర నీదు భృత్యునిఁగ; శ్రీ
శా ! కూర్మదేవప్రభూ ! 11



మ॥ నవనీతమ్మును దొంగిలించు మిషఁ గ్రొ
న్నన్ గోపగేహాళిఁద
ద్వి విధాఘమ్ముల నాహరించితివి ప్ర
ద్విన్ మున్న సద్బుద్ధి యా
దవు లేపున్నెము లాచరించిరో భళీ !
తత్పత్పరాగంబునై
భవమున్ బొందినఁ జాలు ధన్యుఁడను, దే
వా ! కూర్మదేవప్రభూ ! 12

మ॥ తొలి, సుగ్రీవ విభీషణాదులు నినున్
దోరంపు నెయ్యంబుతో,
ఖలులౌ రావణ కుంభకర్ణ ముఖులున్
గాటంపు వేరంబుమైఁ
దలపున్ జేర్చి తరించి రింక నిను స్వాం
తంబందు నెల్లంతు ? ని
య్యాల నేరెంటికిఁ జెడ్డ రేవఁడను, దం
డ్రీ ! కూర్మదేవ ప్రభూ ! 13

శా॥ నీలో సర్వము, సర్వమందును నినున్
వీక్షించుచున్ జ్ఞానులు
ద్వేలంబైన ముదంబుఁ గొంతు రనుచున్
విజ్ఞుల్ వచింతుర్ కదే !
చాలన్ డాదృశ భాగ్య మందఁద్వదుదం
చ ద్రాగ రుగ్రాజి నా
పై లీలన్ బ్రసరింపకున్న, సురవే
ల్యా కూర్మదేవప్రభూ ! 14

మ॥ అరభఁబున్ భీతి ఘటించు నాడు వృజినా
హార్యంబులన్ గూర్చి త్వ
త్కరుణావృష్టిఁ గరంగఁ జేయుము నినున్
ధ్యానింతు దీనుండ నై
గిరిజిత్ పూజిత పాదకంజ యుగళా!
కృష్ణా! హృషీకేశ! సం
సర ఘోరాంభోనిధిపోత! భక్తసురభూ
జా! కూర్మదేవ ప్రభూ! 15

మ॥ కృపమై మానవజన్మమిచ్చి, ఋజువ
ర్తిన్ జేయ విజ్ఞాన ము
ఖ్య పవిత్రోరు ధనాళిఁ గూర్చితి, వహో!
యయ్యర్థమున్ మున్ను నే
విపులన్ దుర్వ్యయమున్ బొనర్చితి, దయా
బ్ధీ! యైహికాశాళి నా
యపరాధంబిది తీసివేయవొకో మా
యన్ గూర్మదేవ ప్రభూ! 16

శా॥ ఏ పాదాంబురుహంబులన్ భవుఁడు వా
గీశుండు సేవింతురో,
పాపం బూడ్ప సమర్థమై పరఁగు! నా
స్వర్వాహినీ ధన్య తా
నే పత్కంజములన్ జపింపఁ దొలుతున్
కృష్ణా! రమానాథ! యా
నీ పాదాంబుజ యుగ్మమున్ గొలిచెదన్
శ్రీ కూర్మదేవ ప్రభూ! 17



శా॥ ఏ నీ భక్తుఁడు తన్మనోంబుజమునన్
నిరపార బంధించెనో
మానా భక్తి బలమ్ముతోడ నినుఁ గ
మ్రి స్వాంతమున్ జూచి, యే
నానాభంగుల నిన్నుఁ జేరఁ బలుకన్
స్వా లేమో! చూచి యీ
వాసంబా చెలినుండి పాపవారో! కృ
ష్ణా! కూర్మదేవ ప్రభూ! 18

మ॥ పలుకన్ బోని నినున్, శిలాత్మఁ బిలుపన్
వమ్మించులో నేరచియున్
బిలువన్ లేక మనంగ నోపన కటా!
నిత్యమ్ము నాయుల్లమ
ర్మిలిఁ ద్వత్ పాదయుగంబుఁ గోరుటను, శౌ
ర్యభూత భక్తిస్థితిన్
బలభిన్ముఖ్యసుపర్వ పూజితపదా
బ్జా! కూర్మదేవ ప్రభూ! 19

మ॥ పరవిన్ గైరవము, చిత్రలేఖనమొ యూ
జన్ బ్రాప్తముల్, గాఁ గనే
నరుఁ డవ్విద్యలఁ ద్వచ్చరిత్ర రచనన్
సార్థంబుఁ జేయన్ గృపా
గరిమన్ వానికిఁ గూర్తు వీవు సిరి, శం
గల్ కీర్తిఁ గైవల్యమున్
స్థిరలీలన్ శివయోగి దేవ వినుతా!
శ్రీ కూర్మదేవ ప్రభూ 20

మ॥ శిశువుఁ డంచున్, మఱి కేశవుం డనుచుఁ ని
స్సీ! మానవుండిప్డు మా
ధవునిన్, నిన్ను, ననంతు, శ్రీవిమల వి
ద్యా సాధ్యునిన్, సర్వరూ
ప విరాట్పూరుషు, సర్వనామ సహితున్,
భావింపఁ గాలేక శు
ష్క వివాదంబుల నెన్నియేఁ జలుపు నీ
శా! కూర్మదేవ ప్రభూ 21

మ॥ ఎదియే నెగ్గది సంభవించు నెడ నెం
తే పూన్కి నో శ్రీప! యా
పద భావన్ గడ యంచుఁ బల్మరు నినున్
బ్రార్థించి మూర్ఖుండు కీ
డది తీఱ న్నిను విస్మరించు నకటా!
యార్యోత్తముల్ బత్తి ని
న్నద ధ్యానింతు రనారతంబును మురా
రీ! కూర్మదేవ ప్రభూ! 22

మ॥ అజ ఫాలాక్ష సురేంద్ర సన్నుత కృపా
వ్యాపార! ధీసార! శి
ష్ట జనోద్ధార మనోవిహార! సురభిత్
సంహార! సర్వం సహా
సృజనాధార! కనచ్ఛరీర! కమలా
హృచ్చోర! సంసార సా
మజ హర్యక్ష కిశోర! ప్రోవు మనుకం
పన్ గూర్మదేవ ప్రభూ 23



శా॥ భాగ్యమ్మున్ గడియింపనౌఁ బ్రబలసత్
పాండిత్యమున్ బొందనౌ,
యోగ్యుల్ మెచ్చెడునట్లు, మానవునకున్
యోచింప సంపూర్ణ వై
రాగ్యం బెన్ని భవంబులన్ గడిపినన్
బ్రాప్తించునే? త్వల్లస
ద్భాగ్యశ్రీద కృపాప్తిఁ గాక సురసే
వ్యా! కూర్మదేవ ప్రభూ! 24

శా॥ శ్రీలన్ బొందెడు వేళ హర్షజల రా
శిన్ దోఁగుచున్ సారె, నా
మోలన్ జేరఁగఁ గష్టరాశి విపులన్
రోదించుచున్ బిట్టు నిన్
వాలాయమ్ముగఁ గొల్వ నిస్సి! మఱతున్
బ్రాల్మాలికన్ మాని శ్రీ
లోలు న్నిన్ను జపించు టెన్నడో! కృపా
ళూ! కూర్మదేవ ప్రభూ! 25

మ॥ కపి చేతన్ ఘటియింపఁ జేసితఁట
త్వత్కార్యార్థ సాఫల్యమున్
విపులన్ రామనృపాల కాఖ్య, ఘనతన్
సీతాధిపా! నాదు హృ
త్కపి నీ కైవసమున్ బొనర్పఁగదె
నీ కైంకర్యమున్ జేయఁగా
జవలత్వంబును వీడునట్లుగ, రమే
శా! కూర్మదేవ ప్రభూ! 26

మ॥ ధర నెవ్వాలి భజించినన్ వృజిన సం
తానమ్ము క్షీణించునో,
యరిషడ్వర్గము భీతిమైఁ దొలఁగునో
ప్రాప్తించునో మోక్ష రా
జ్య రమాశ్లేష విశేష భాగ్యకళ వి
జ్ఞానాప్తిచే నట్టి శ్రీ
హరి వౌ నిన్ను భజింతు సంతతము దే
వా! కూర్మదేవ ప్రభూ! 27

మ॥ శిరమున్ బాదములన్ బహిర్గతముగా
జెల్వంబుమై నుంచి, చె
చ్చెర వానిన్ దఱిసూచి డాఁచెడు
ఘలి శ్రేష్ఠ స్వరూపంబుఁదా
ల్చి రహిన్ లోకచయమ్ము త్వన్మహితకు
క్షిన్ గల్గి, నీయందె వా
విరి లీనంబయి యుంటఁ జెల్వ దొగి ను
ర్విన్, గూర్మదేవప్రభూ! 28

మ॥ అవనీకాంతయు, శ్రీ వధూటియును నీ
స్వాధీన మం దొప్పఁగా
సవనమ్మున్ బాసరించు దైత్యు క్షడ భి
క్షు మ్మోజ నర్థంపవే
శ్రవణానంద కరంబు నీ చరిత మీ
శా / దాస హృద్వాస! సత్
కవియోగి ప్రణుతోరు వేష! యకళం
కా! కూర్మదేవ ప్రభూ! 29



మ॥ పటు చోరుండవు నీవటంచు ధరణిన్
బల్కాఱు నేఁజాటి యా
దట నీకున్ మఱి కన్యనీయఁ గద స
త్యానాథ! జీర్ణంబు లౌ
నటుకుల్ వెట్టను నీకుఁ గోరి యెటుల
భ్యంబౌనో! త్వత్ సత్కృపా
పటలీ శ్రీ, యలరింప నన్ను దరిఁ జే
ర్పన్, గూర్మదేవ ప్రభూ! 30

శా॥ ఖ్యాతిన్ గాంచఁగఁ గోర నిద్ధ కవిగా
నా కాంక్ష యొక్కింత మ
చ్చేతో వీథిఁ గనంగరా దతుల కీ
ర్తిన్ బొంద జ్ఞానాఢ్యుఁగా,
భాతంబైన సువృత్తమున్ గొనిన త్వ
ద్భక్తాళి పెన్ లెంక నా
రీతిన్ గ్రాలఁగఁ జేయు నన్ను మొఱకున్
శ్రీ కూర్మదేవ ప్రభూ! 31

శా॥ ఈశా! నారక మన్న నెట్టి వెఱ మ
ద్భ్రద్గోళమున్ జేరునో
యా సౌపర్వణ భోగ షండ మనుచో
నారీతినే కుందెద
నీ సామీప్యము నందఁగోరెద, బుధా
నీకంబునున్ గొల్వఁగా
నాశింతున్, గృప నింపుమయ్య, గుణ భ
ద్రా! కూర్మదేవప్రభూ! 32

శా॥ కోటన్ బద్మ భవాండ భాండములనేఁ
గొంగొత్త బంతుల్ బలెన్
మీటన్ జాలెడు నీకుఁ గవ్వపుమొలన్
మేనూన నేపాటి ? నీ
చాటన్ గూర్చెడు నంతె కాక, కరి మో
యున్ జాలుచున్ దాలనేఁ
గీటంబున్ భరియింపలేదా ? నిజ శ
క్తిన్ గూర్మదేవప్రభూ ! 33

మ॥ వర్ణగోప్తాళ, యశోద ఆోటికి నిన్నున్
బంధింపఁగాఁ జాలునే ?
యూరు వాత్సల్యము తోడఁగా, కటు నమే
యున్నిన్ను సర్వాంతరున్
హరిఁగట్టెన్ దల మాను దాఁగిట ! భళిరా !
యాసాధ్వి పుణ్యంబు తాఁ
జిరవర్ణ్యంబు గదా జనార్దన ! పరా !
శ్రీ కూర్మదేవప్రభూ ! 34

శా॥ నీ దాస్యంబు నొసంగితో గుహుని
హృన్నీరేజమున్ దన్పఁగా,
కాదే నుర్వి భవాబ్ధి పోతముగఁ బ
త్కంజంబు గాఁగలంగ నీ
కాదివ్యాపగ ధాటినెంత ? కరుణా
వ్యాపార పారీణత
నీ దాసాళికిఁ గూర్తు వీప్సితములన్
శ్రీ కూర్మదేవ ప్రభూ ! 35



మ॥ హితుఁడీతం, డహితుం డితం డనుచు నే
నెంతేని మూఢుండ నై
సతతంబున్ గడు ద్వంద్వబుద్ధిఁ దలఁతున్,
సర్వంబుఁ ద్వన్మూర్తి యం
చతి విశ్వాసము నప్డు కాంచెదనో ! బ్ర
హ్మానందమున్ జెంద సం
స్తుతమై భాసిలు త్వత్ కృపాకలనం జి
ష్ణూ ! కూర్మదేవప్రభూ! 36

మ॥ కపినాథు, ధ్రువు, నంబరీషన్నృపు, భ
క్త శ్రేష్ఠుఁ బ్రహ్లాదునిన్,
హరిముఖ్యున్ హనుమన్ విభీషణు, నరున్
దన్పంగ హృద్వీధి నే
కరుణన్ బూనితివో గదయ్య మఱి, తత్
కారుణ్యమున్ బూని త్వ
చ్చరణాంభోరుహ భక్తి నాకు నిడు మీ
శా! కూర్మదేవ ప్రభూ ! 37

మ॥ గిరిభిన్ముఖ్య సుపర్వ మౌళి మణి రు
క్ప్రాజి తాంఘ్రి ద్వయున్
గిరిజా నాథ విరించి సంస్తుత లసత్ కీర్త్యు
జ్జ్వలున్ బద్మజా
తరళాక్షీ నిల యానుకూల విపులో ద్యన్నీల
వక్షస్థలున్
దరి చేయ న్నుతియింప నౌనె ? నిను వ
ప్తా ! కూర్మదేవ ప్రభూ ! 38

శా॥ ఏదే నాపద దాపరింప మదిసం
తేఁ గుందెదన్, భ్రాంతిచే,
మోదం బందెద సౌఖ్యముల్ పొలయుచో
మూర్ఖుండనై యేచి ద్వం
ద్వోదాసీనుఁడఁగాను గాన, వెలిమై
నూహించెద న్నాపయి
న్నీ దాక్షిణ్యము లేదటంచు మిత్రులన్,
శ్రీ కూర్మదేవ ప్రభూ! 39

మ॥ జలజాతాసన సన్నుతా! పరిమిత
జ్ఞానాప్తి మర్త్యాళికిన్
వలనా నే? తెలుఁగంగ నీ మహిత త
త్త్వంబున్ జలంబార నా
దల కిందై తప మాచరించినను ద్వ
త్కారుణ్య సంప్రాప్తిఁగా,
కలఘూదంత? యనాది మధ్యలయ! దే
వా! కూర్మదేవ ప్రభూ!. 40

మ॥ ప్రిదులన్ బోయెడు మానసం బకట! యా
భీలార్తులన్ లేమిఁ గూ
రి దీన మ్మొక్క యుగంబుగాఁ గడపువా
రిన్ జూడ మా బోఁట్లకున్
గద! రాజిత్ కరుణాబ్ధి ముఖ్య బిరుదాం
కా! యెట్లుపేక్షింతువో
ముదమున్ గూర్పక యెల్లవారికి స్వయం
భూ! కూర్మదేవ ప్రభూ! 41



శా॥ ఛేదంబై యవిలంఘ్యమయ్యెడు భవా
బ్ధిన్ మానవుం డాదట
న్నీ దాక్షిణ్యము కల్మి దాఁటెచనఁగ,
న్నీ భృత్యుఁడై యేచుచున్
మోదం బొప్ప సమీరనందనుఁడు తా
మున్నీటినిన్ దాఁటుచో
లే దింతేనియు నబ్బురంబు, వనమా
లీ! కూర్మదేవ ప్రభూ! 42

శా॥ స్థూలంబై కనుపట్టు భూమి పొడమెన్
దోయంబునన్, దజ్జలం
బోలిన్ వహ్ని జనించెఁ బావకము వా
యు ప్రోద్భవంబయ్యె, వా
తూలం బుద్భవ మయ్యె నాకసమునన్
దుర్వేదమౌ శక్తిఁ ద
న్మూలంబాదు, వెలుంగ నౌనె నిను జి
ష్ణూ! కూర్మదేవ ప్రభూ! 43

శా॥ ఏనన్ బల్కిన కర్గమున్ మనము నం
దెంతే వితర్కించుచున్
దూనా నీదు కృపా విశేషమున స
న్మార్గుండు సర్వంబుగన్
దానే యుంట నెఱింగి పొందునట యా
నందంబుఁ దదీప్సితి నా
కేనాఁ డబ్బునొ తెల్పవే, సదయ మురా
రీ! కూర్మదేవ ప్రభూ! 44

మ॥ కరుణ బూని యొసంగు మప్ప ! బుధకైం
కర్యంబునున్, సత్యవా
ఙ్నిరతిన్, పావక పాదకంజయుగ భ
క్తిన్, శుద్ధ వైరాగ్యమున్
బరకాంతార్థ పరాఙ్ముఖత్వము, సిరుల్
వాంఛింప నెబ్భంగి బం
ధుర సౌఖ్యాప్తికిఁ బద్మనాభ ! శ్రితబం
ధూ ! కూర్మదేవప్రభూ ! 45

మ॥ నిను గాపాలిక ముఖ్య భైరవుఁగ ని
న్నే సూర్యుఁగా సౌరముల్
ఘనశైవంబు శివాఖ్యుఁగా ధరణి గా
ణాపత్య మార్యాళనూ
జనిఁగన్ వైష్ణవ మర్థి శ్రీశుఁడగు వి
ష్ణుండంచు, శ్రీ శక్తియం
చును శాక్తేయము సన్మతిన్ దెలుపుచుం
డున్, గూర్మదేవ ప్రభూ ! 46

మ॥ కుడువన్ బోయెడు వేళ నేని, నెటనేఁ
గూర్చుండుచో నేని, నె
య్యెడ నే కార్యముఁ జేయుచున్నను భవా
నీశాజ సంస్తుత్యమై
కడు రంజిల్లెడు నీదు నామము మనః
కంజాత మందెప్డు ని
ల్చెడు ప్రజ్ఞన్ దయసేయు నాకు శుభదా !
శ్రీ కూర్మదేవ ప్రభూ ! 47



మ॥ భువనాళిన్ సృజియించు నట్టితఱి నం
భోజాసనాభిఖ్యం, మా
ధవ సంజ్ఞన్ బరిరక్షఁ జేయు నెడలన్
దన్నాశమున్ జేయుచో
భవనామంబునఁ బొల్తు వీవు, నృహరీ !
భావింప శక్యం బటె
ట్లవు; నీయుపమితిమాన వృత్తములు, కృ
ష్ణా ! కూర్మదేవప్రభూ ! 48

మ॥ నిగమాంతంబులు నిన్నుఁ గూర్చి తెలుప
న్నేర్పమియున్ లేమి నిం
బుగ నిన్ దెల్పక 'నేతినేతి' యనుచో
మూర్ఖత్వమే రూపమై
జగతిన్ గ్రుమ్మరు నేను నీసుమహితై
శ్వర్యంబు వర్ణింపఁగా
నగు సుజ్ఞానము నెట్లు పొందెదను దే
వా ! కూర్మదేవ ప్రభూ ! 49

మ॥ ఒగి రూపాంతర మాను నట్టులుగఁ జే
యున్ శాస్త్రకారుండు తాఁ
దగ సృష్టింపఁ గలాఁడె ? యల్పపుఁబదా
ర్థంబేదిఁ దన్నాశమేన్
జగతిన్ జేయఁగఁ జాలఁ డట్టులవుటన్
సర్వంబు సృష్టించునీ
దగు సామర్థ్యము నెన్ననౌనె భగవా
హా ! కూర్మదేవప్రభూ ! 50

శా॥ అమ్మా! మన్నుఁ దినంగ లేదు చూమి నే,
నన్నయ్య నీతో నస
త్యమ్ముల్ పల్కెఁ బరీక్షఁ జేయు మిదెనా
యాస్యమ్ము టం చన్న, లో
నెమ్మిన్ సర్వ జగంబులన్ జనని ధాత్రిం
జెందఁ జూపించు, నిన్
సమ్మోదమ్మున నెంతు భక్త సురభూ
జా! కూర్మదేవప్రభూ 51

శా॥ నా మాధ్యంబున, నిన్ గృపాజలధి, నా
మ్నాయాంత వేద్యున్ గుణో
ద్దామున్, భక్త సురాఘనీజముఁ గటా!
దాక్షిణ్య హీనాత్ముఁగా
నే మున్నెంచి యఘంబుఁ బొందితిని, మ
న్నింపంగదే యిందిరా
రామావల్లభ, యుష్ణశీతకర నే
త్రా! కూర్మదేవప్రభూ! 52

మ॥ తలఁప న్నీ కొమరుండు బమ్మ, యొకవాం
దన్ లచ్చి నీయాలు న
ప్పలుకుం దొయ్యలి నీదు కోడలపుటన్
వాసి న్నినున్ గొల్చు బ
త్తులకున్ జేకుఱుఁ గాద కే. మనికియున్
దోరంపుఁ గల్మిల్ తగ
న్నలువౌ విద్దెయు, మేటి వేలుపుల మి
న్నా! కూర్మదేవప్రభూ! 53



శా॥ శ్రీపా! యెంగిలిపండ్ల నిచ్చు వనితన్,
శిక్షింపఁగా నెంచినిన్
గోప్త్రీ దేశత రోటఁగట్ట సుదతిన్
మోదాబ్ధిఁ దేలించియున్
స్వాపంబందు ననైన నీకపకృతిన్
వాంఛింప శగ్గించునన్
గాపాడన్ దొరఁకో విడేమొకో శుభాం
గా! కూర్మదేవప్రభూ! 54

శా॥ కౄరుండా శకటాసురుండు తొలి నిన్
గూలార్చు దుర్బుద్ధిమైఁ
జేరన్ వాని శరీర చక్రముల వేఁ
జెండాడి, భక్తాళి సం
సారావారణ చక్రమున్ విఱిచి మో
క్ష ప్రాప్తిఁ గావించుటల్
ప్రారూఢిన్ ధరఁజాటుచుండు సురసే
వ్యా! కూర్మదేవప్రభూ! 55

మ॥ ఇల, నేఁ జేసితిఁ జేయుచుంటిఁ బనులె
న్నేఁ జేయు దేనంచు న
ర్మిలి నెంతే దురహంకృతిన్ మెలఁగ భూ
భృత్తుల్య భారమ్ముతో
నలయన్ జేసెను నన్ను సంసృతి, త్వదీ
యాధీనముల్ నాదు చె
య్వులు, నా నమ్మికఁ గాదె తద్భరము మా
యున్ గూర్మదేవ ప్రభూ! 56

శా॥ పట్టన్ జూచిన నింతమానక పటు
స్వాభావికం బౌట మై
పుట్టున్, వర్ధిలు, నాశమున్ గనుననన్
మార్జుండు దేహస్థితిన్
గట్టా ! విస్మృతి నొంది యువ్వపు వింతన్
దానంచు భావించుచున్
జెట్టన్ బొందు, నెఱుంగ లేఁడు తనుదా !
శ్రీ కూర్మదేవప్రభూ ! 57

శా॥ అశ్వేశాధిపుఁ డెట్టి భక్తిరతముల్
యజ్ఞంబులున్ జేసెనో !
విశ్వేశున్ నినుఁ గాంచి, యాలయము స్థా
పింపంగ నీ యాజ్ఞ నా
యశ్వారాయఁడు నిన్నుఁ దన్వమును మా
న్యారాధనన్; గొల్తుఁ ద
ద్విశ్వవ్యాప్తయశోవిరాజాలను భ
క్తిన్ గూర్మదేవప్రభూ ! 58

మ॥ మహితానందదతత్త్వ ! మారశతక
మ్రిస్ఫార సౌందర్య ! మి
త్రహిమాంశు ప్రదితాక్ష ! మీలకముఖ
ప్రస్ఫీత వేషా ! ముము
క్షుహితా ! మూర్ఖపలాశి దండన బలా
స్త్రోశా ! మృడాన్యగ్రిజా !
యహిరాట్ తల్ప ! మునీంద్ర కల్పక ! యన
ల్పా ! కూర్మదేవప్రభూ ! 59



శా॥ శౌరీ ! నాలుక జాతి నీవు తమిమై
పాతాళితిన్ "శ్రీ" యన
న్నారీ రత్నము కిన్కఁ బూన, ననుమం
గ ప్రాప్తికై యాశ వ
స్నీరే జద్వయి నన్యకాంత లెవరున్
వీక్షింపకుండ న్నమ
స్కారమ్ముల్ జొనరించు విన్ దలఁతుఁ గృ
ష్ణా ! కూర్మదేవప్రభూ ! 60

మ॥ తొలి, వేదంబులఁ ముచ్చిలించి జలధిన్
దుర్మార్గుఁడై యేగి దాఁ
గిలు నక్తంచరు సోమకున్ దునిమి చ
క్రీ ! మీన రూపంబుదో,
నల వేదాళి విరించి కీయవె యుజం
డానంద మొందంగ శ్రీ
లలనా మానస పద్మమిత్ర ! శ్రితక
ల్పా ! కూర్మదేవప్రభూ ! 61

మ॥ బలిమిన్ దివ్యులుఁ బూర్వదేవతులుమున్
బాదోధిఁ ద్రిచ్చంగఁ బో
ధులినా ధాకృతి లీలఁ బూని తరిగ
ట్టున్ దాల్చి, మెట్టేని నా
కులకున్ బెట్టవె దిట్టవై యమృతమున్
గూర్మిన్ జగన్మోహినీ
విలస ద్వేషముతో, నుపేంద్ర ! కరుణా
బ్ధీ ! కూర్మదేవప్రభూ ! 62

శా॥ ఆనాఁ డీ భువిఁ జుట్టి చాపఁ బలె స్వ
ర్ణాక్షుండు పీడింపఁగా
దానన్ గిన్కను జెంది యావు ఖలునా
దైత్యాధమున్ గూల్చవే
నానా ప్రాణులు హర్షమున్ మిగులఁ బొం
దన్ ఘోర కోలాకృతి
న్నే నీ శక్తి నుతింపఁ జాల జడుఁడన్
శ్రీ కూర్మదేవప్రభూ ! 63

శా॥ నీ రేజోద్భవుఁ బ్రీతుఁ జేయఁగ వరా
నీకమ్ము ప్రాప్తింపఁగాఁ
గ్రూరుండై బుధులన్ గలంచుచుఁ గుమా
రున్ భక్తు బ్రహ్లాదునిన్
గారింపన్ జను నా హిరణ్యకశిపున్
గర్వాంధుఁ డున్మాదవే
స్ఫార ప్రౌఢి నృసింహ రూపమున శ్రీ
శా ! కూర్మదేవప్రభూ ! 64

శా॥ ఉల్లంబందు నహంకరించి బలి దా
నోడించి దిక్పాలకన్
ముల్లోకంబులఁ గెల్వ, వామనుఁడవై
భూదానమున్ గోరి యా
యొల్లన్ ముజ్జగముల్ పదత్రయముచే
నేహారి చేకొన్న నీ
సల్లీలాకృతి, నాత్మనెంతు, హతదో
షా ! కూర్మదేవప్రభూ ! 65



శా॥ గర్వాంధమ్మున నేవుఁ జూపు ఖలులా
క్ష్మాజానులన్ ద్రుంచితే !
దోర్వీర్యమ్మున జానుదగ్నిగ సుర
స్తోమమ్ము నందింపఁగా
నుర్విన్ సజ్జనకోటి మెచ్చఁ, శ్రితబం
ధూ ! నిన్నుఁ గైవల్యదున్
సర్వేశున్ శుభదాయకుం గొలుతునో
జన్ కూర్మదేవప్రభూ ! 66

మ॥ ఘనుఁడౌ పంక్తి రథ ప్రభూత్తముసుతున్
గౌసల్యకున్ గల్గి పా
వన రామాఖ్యను దేజరిల్లి రమయౌ
వైదేహిఁ బెండ్లాడి, ని
ర్ఘానను లీలన్ సుజనావనంబుఁ జలుపన్
గ్రూరాత్ములౌ రావణా
ది నరాద ప్రకరమ్ము గూల్చితిని వృ
ద్ధ్విన్ గూర్మదేవప్రభూ ! 67

శా॥ నిత్యానిత్య వివేక హీనత బుధా
నీకమ్ము బీడించు నా
దైత్య క్ష్మావరులైన కంసముఖ వి
ఖ్యాతులన్ గూల్చి సౌ
హిత్యమ్మున్ ధరఁ గూర్చవే శ్రితులకున్
గృష్ణుండవై సీరివై
శుష్యద్వేల లసత్ స్వరూపుడవు జి
ష్ణూ ! కూర్మదేవప్రభూ ! 68

శా॥ యజ్ఞంబుల్ వానరించు వ్యాజమునఁ గూ
శాత్మ్యల్ నరుల్ మున్ను వే
దాజ్ఞల్ మీఱి దయావిహీనతఁ బశు
ప్రాణంబులన్ దీయఁబోన్
విజ్ఞానంబును గూర్చితో నరులకున్
హింసాళి వారించి – స
ర్వజ్ఞత్వ స్థితి బుద్ధమూర్తి వయి, దే
వా ! కూర్మదేవప్రభూ ! 69

శా॥ స్వామీ ! ధర్మము నొవ్వఁ జేసి కలియే
పారన్, గృపామూర్తివై
భూమిన్ ధర్మువుఁ బ్రోవఁగన్, గలియుగం
బున్ ద్రోయఁగాఁ గల్కివై
భీమం బారువ నశ్వవాహనుఁడవై
పేర్మిన్ గలిన్ గూల్చు నీ
సామర్థ్యంబు నుతింపఁగా దలమె ? శ్రీ
శా ! కూర్మదేవప్రభూ ! 70

మ॥ ఎదియేఁ గానుక భక్తి నీకు నిడ లో
కంబున్ సమస్తంబు నీ
యదియై యుండఁగ నన్నుఁగూడి మఱి నా
దై యున్న దింకేది ? నా
యెద నిన్నున్ జపియింతు గాక సతమున్
శ్రీశా! కృపాసార భా
స్వదనంత ప్రతిభావి భాశ్రిత కవీ
శా ! కూర్మదేవప్రభూ ! 71



మ॥ శిలనేఁ గాను, నరంగుఁ గాను, గపినై
జీవింప, బుభుక్షంబునై
యిల జన్మింప. నిశాట జాతిఁ బొడమన్
బృథ్వీన్ జనిన్ బొందితిన్
మెలఁగన్ దీన నరాధముండనయి స్వా
మీ ! త్వత్కృపాలేశ మి
మ్ముల నేఁ బొందఁగ నెట్టులబ్బు సతతం
బున్, గూర్మదేవప్రభూ ! 72

శా॥ వాగీశుం డెఱుఁగంగలేక మును నీ
ప్రజ్ఞావిధిన్, డాఁపఁగా
గో గోపాల తతిన్, ధరింప వానిగా, త
ద్గో గోప రూపంబులన్
వేగ న్నీవ, యజుం డెఱుంగఁడు గదా!
నీ శక్తి నింతేని, ధా
త్రీ గోళంబులఁ జేయఁగాక, నృహరీ !
శ్రీ కూర్మదేవ ప్రభూ 73

మ॥ ఎది సత్యంబో, విశుద్ధ మేదో, జగతీ
హేతుక్రమం బేదో, య
య్యది జ్ఞానంబగు, నేది శ్రీ నిలయమా
నానంద కందంబో, య
య్యది నీవే యని యార్యులాడెదరు, భా
వాతీతుఁడౌ నిన్ను నా
మది నేతీరున నిల్పికొందు మహితా
త్మా కూర్మదేవ ప్రభూ 74

శా॥ శ్రీ కల్యాణ గుణా! యహల్య గురు సా
శీల్యన్ శిలాకార నే
పౌకారుణ్యము తోడఁ బ్రోచితఁట సా
ద్యాంభోజ ధూళీలవం
బాకెన్ శాపవిముక్తఁ జేసెనాఁగఁ బూ
ర్వాకారమున్ బొందనా
నీకమాత్రాధిక శక్తి నౌ న తడవన్
శ్రీ కూర్మదేవ ప్రభూ 75

మ॥ జగమే నిత్య మటన్న భ్రాంతియు, మన
శ్చాంచల్యమున్, గ్రోధమున్
దగ నిన్ గొల్వని కారణమ్మునఁ గదా!
దాపించు మర్త్యాళి నో
జగదీశా! నినుఁ గొల్చు నాతఁడు మహా
సౌభాగ్యాంబుధిన్ దేలఁడే!
ఖగరాడ్వాహ! పయోధివాస! భవభం
గా కూర్మదేవ ప్రభూ 76

మ॥ మతిహీనుం డయినన్, గురూపి యయినన్,
మాయావి యేమైన, దు
గ్మత దుఃఖించుచునున్నఁ గాని, యనుకం
పన్ మాత లాలించు నా
దృతిఁ, బుత్త్రిన్ విడనాడఁబోదు కద! త
ద్రీతిన్ వెలార్పన్ జగ
త్పిత! నన్నున్ మొఱకున్ క్షమింపు మను ర
క్తిన్, గూర్మదేవ ప్రభూ 77



శా॥ భోగిన్ యోగిఁగ; యోగి భోగిఁగను మా
ర్చన్ జేయు సామర్థ్య మెం
తే గణ్యస్థితి నీకుఁ గాంచిలఁ బ్రిమదా
ద్రిన్ గొందఱిన్ దేలుచున్
వాగుద్వేల విభిన్న దుఃఖముల ముం
పన్ జెల్లునే కొందఱిన్,
రాగం బొప్పఁగఁ బ్రోవు మెల్లరి నుపేం
ద్రా! కూర్మదేవ ప్రభూ 78

మ॥ శ్రుతశీర్షాళి విభావణంబు, బుధ సం
స్తుత్యంబు, ధీంగైక పం
సృతి వారాన్నిధి నౌక, ముక్తివనితా
శ్లేషోల్ల సత్కారి, సం
శ్రిత కల్పద్రుమ పుష్ప గుచ్ఛమయి వా
సిల బేర్చు త్వత్ పాదమున్
మది నూహింతు ననూనభక్తిఁ బరమా
త్మా! కూర్మదేవ ప్రభూ 79

శా॥ జ్ఞానంబంచును గొందఱున్, మఱియు నీ
శా! బుద్ధి నూహింపఁగన్
మానో భక్తి యటంచుఁ గొందఱు నినున్
మావల్లభుం బొంద నెం
తేనిన్ మార్గము నాఁగఁ బల్కెద రహో!
నేర్వన్ వదర్థంబులే
నీనామ స్మరణంబ యే నెఱుఁగుదున్
శ్రీ కూర్మదేవ ప్రభూ 80

శా॥ ఈవే విష్ణువు, శంభు వీవు, హరి యీ
వే బ్రహ్మవున్, శక్తియున్
దేవా! యీవె గణాధినాథుఁడ వహో!
దేవేంద్రుఁడున్, సూర్యుఁడున్
రేవెల్గున్ దలఁపంగ నీవ, యిదియే
నీ కంటె నన్యంబు, గా
దో వైకుంఠనివాస! దాసజనబం
ధూ! కూర్మదేవ ప్రభూ 81

మ॥ మునిహృత్ పద్మవిభావసున్, ఖలరిపున్,
ఫుల్లాబ్జనేత్రున్, కృపా
వనధిన్, భక్తచకోర శీతకిరణున్,
వైకుంఠధామున్, శ్రితా
వవదక్షున్, గమలావిభున్, సురధునీ
వప్తన్, యశోదాసుతున్
నిను ధ్యానింతు ననంత మోద మెనయన్,
శ్రీ కూర్మదేవ ప్రభూ 82

మ॥ అలవేదాళి, పురాణముల్, మఱియుఁ గా
వ్యమ్ముల్ రహ న్నీదు ని
స్తుల మాహాత్మ్యము నుగ్గడింపఁగ వలం
తుల గావటన్నన్, నినున్
దెలియన్ జేసెడి దేమియింక వెలయున్?
నీ సత్కృపా లబ్ధ పే
శల సద్భక్తియ కాక, శిష్ట సుర భూ
జా! కూర్మదేవ ప్రభూ 83



మ॥ జగతిన్ గానఁగఁ గుంభకారుఁడు ధవా
శన్ మట్టితో భాండముల్
తగఁ గావింపఁగ నేర్చు; నాటగ జగ
ద్భాండమ్ముల న్నీ వశా
స గతిన్ నిర్మితి, చేయుచో మెలపునన్,
మన్నున్, గులాలుండు మా
మగ నీవే యవు దబ్బురంబు కదె వి
ష్ణూ! కూర్మదేవ ప్రభూ 84

మ॥ ధరణిన్ జీవు లనేక మార్గముల నిన్
ధ్యానింత్రు, పొందన్, శుభం
కరు నిన్నున్, మఱి యీ వధీశుడవు, త్వత్
కైంకర్యమున్ జేయు కిం
కరుఁడన్ నే, నను పద్ధతిన్ గొలువ యు
క్తంబౌ, గదే యెందు, దా
శరథీ! వాయుకుమార పూజిత పదా
బ్జా! కూర్మదేవ ప్రభూ 85

మ॥ ఒనరన్ సారెకుఁ బ్రావినన్ విమల పీ
యూషంబు సంతుష్టిఁ గూ
ర్పని మాడ్కిన్ భవదీయ నామమును భా
వంబందు సద్భక్తితో
ననిశంబున్ స్మరియించు చుందురొగి భ
క్తాగ్రేసరుల్, తద్విధం
బెనయ న్నాకును గూర్పు మయ్య! సుగుణా
బ్ధీ! కూర్మదేవ ప్రభూ 86

మ॥ ధవళాబ్జంబులఁ గేరు నేత్రములతో,
దంతీంద్ర హస్తమ్ములన్
జివుకన్ జేయఁగఁ జాలు బాహువులతో
సింహాంబు రాకొట్టు తేఁ
జువ నొప్పారు స్వరంబుతో, విమల సి
గ్గున్ బొందఁగా జేయు పా
న్నవ పద్మంబులతోడఁ గన్పడవె, ని
త్యా! కూర్మదేవ ప్రభూ 87

మ॥ అలనాఁ డిద్ధర గోప బాలకుఁడవై
పాలించ ద్గతిన్ బెంచి గో
వులు, గోపాలురు, గోపికల్ పరిమదమున్
బొందంగ వంశంబు న
ర్మిలి మ్రోయించుచు, గాన సీధువుల సం
తృప్తిన్ గూర్చు నిన్నున్ మహో
జ్జ్వల వృత్తున్ శ్రితరక్షకుండవలఁతుఁ గృ
ష్ణా! కూర్మదేవ ప్రభూ 88

మ॥ కరులన్ గోరను, వాజిరాజి నడుగన్
గాంక్షించి సౌఖ్యమ్ము నే
నీరులన్ వేఁడ, భటాళి వాల్లఁ గృపమైఁ,
జెల్వొప్ప నాకీవె ద్వ
చ్చరణాంభోజ యుగ స్థిరోజ్జ్వలమతిన్
సద్భక్తి నిన్ గొల్వఁగా
సరసీజాయత లోచనా! రమే
శా! కూర్మదేవ ప్రభూ 89



మ॥ అనయంబున్ మధుసూదనా! హరి! ముకుం
దా! దేవకీనందనా!
వనజాక్షా! గరుడధ్వజా! యనుచు నిన్
భక్త్యున్నతిన్ జేరు స
జ్జనులన్ మొక్కిక్కడఁ దత్పదాంబుజ రజో
జాలంబు మస్తూర్ధమున్
దనియింపంగ నలంకరింపఁగ, సనం
తా! కూర్మదేవ ప్రభూ 90

శా॥ తాలాంకానుజ! పంకజాక్ష! వరదా!
దామోదరా! శ్రీధరా!
కాళిందీవర! నందనందన! హరీ!
కంజాప్త చంద్రాంబకా!
నీలాపాలక! గానలోల! శుభదా!
నీరేజనాభా! ననున్
బాలింపన్ దమకింపు మయ్యా! యనుకం
పన్, కూర్మదేవ ప్రభూ 91

శా॥ ఇందీనాయక! లోకపాలక! దయా
బ్ధీ భక్తమందారమా!
నందానందకరా! సనందవినుతా!
నారాయణా! సచ్చిదా
నందా! మందరనాగధారి! యనఘా!
నాగేంద్రతల్పా! నిమున్
డెందం బందున నిల్పికొందు సతమున్
శ్రీ కూర్మదేవ ప్రభూ 92

మ॥ భవ భూమీజ కుఠార! సజ్జన శిఖీ
వారిదాంబుదా! మౌని హృ
ద్భవన న్యస్త వినూత్న భవ్యమణిదీ
పా! సాంద్రపాపాటవీ
దవవహ్నీ! యవివేక మేఘపవనా!
దైత్యేభ పంచాననా!
స్తవమున్ జేయుటకొప్ప నిన్ను ? కుర్రిపే
ద్యా! కూర్మదేవ ప్రభూ 93

మ॥ నడుం డీ జన్మమునందె నిన్ను, హరి, శ్రీ
సాధు న్నుతింపన్ వలె,
న్నరసీలోఁ బలుకంగఁ బూనఁగవలె,
న్నికై మహాపూజల
న్నరపన్ గావలె, లీల, నీ వలన నెం
తేహాయిఁ బొందంగ నీ
కెరఁగన్ గావలె నెల్లప్రొద్దులను, దం
డి! కూర్మదేవ ప్రభూ 94

శా॥ ఆసల్ పీచులు, కల్మిలేములు సుడుల్,
ప్రాప్తించుచునే జాలు
పా సౌఖ్యమ్ములు దుఃఖము ల్మకరముల్,
వ్యర్థంబె యాసీవని
స్నీ! సంసార పయోధి, భక్తితరిణిన్
హేలా కృపామూర్తివై
యాసాదింపఁగ జేయవే, శ్రీశర
ణ్యా! కూర్మదేవ ప్రభూ 95



మ॥ అమలాకాంతు, వసంతుఁ, గాంత ధవళ
పాలించదయాళ శ్రస్నగ్ధితా
బ్జ మరాళావర దంతుఁ, గాంతి జిత భా
స్వంతున్, మహోదంతు, స
త్సు మనోద్యాన వసంతు, భూరి కరుణా
సుస్వాంతు, శ్రీమంతు, నిన్
బ్రిమదం బొప్పఁగ నెంతు, మారహర మి
త్రా! కూర్మదేవ ప్రభూ 96

మ॥ అమరాధ్యక్ష విరించి శంభునుత పా
దాంభోజ! ప్రహ్లాద ము
ఖ్య మహాభక్త సురావనీజ! యతిరా
జ్యఁభోధి సంపూర్ణ రా
జ! మహీ స్వర్గ రసాతలాది భువన
స్రగ్గాత్రిజ! గోపీ మనో
జ! మహైశ్వర్య కళారమా జిత బిడౌ
జా! కూర్మదేవ ప్రభూ 97

శా। శ్రీలోలున్, గరుణాలవాలు వ్రిజనా
రిపాలు, నక్తంచ రా
భీలున్, గీర్తిత చారుశీలు, మృగనా
భీచిత్రఫాలున్, దిశా
పాల స్తుత్య సమస్త భారవహ, శుం
భచ్ఛక్తిజాలు న్నినున్
హేలన్ గొల్చెదఁ గ్రాలు భక్తి నతమున్
శ్రీ కూర్మదేవ ప్రభూ 98

శా॥ దక్షున్, సర్వసుపర్వ రక్షకు, లస
ద్దాక్షిణ్యగణ్యున్, సరో
జాక్షున్, క్రూర నిశాట ఝాట మదవే
దండోగ్ర హార్యక్షుం, ఘో
లాక్ష ప్రస్తుత చారు కీర్తి, వరదున్, మా వా
సవక్షున్, సుధీ
పక్షు, న్నిన్ను, భజింతు మోక్షదుని, శే
వన్ గూర్మదేవ ప్రభూ 99

శా॥ ఓ దైత్యాంతక! యో కృపాజలనిధీ!
యో భక్తకల్పద్రుమా!
యో దీనావన! యో ఫణీంద్రశయనా!
యో శౌరి! యో నీరజా
క్షా! దైన్యమ్మున నన్ను డించిన దుర
జ్ఞానమ్ము మూలమ్ము పెం
పేదం జేయుము వేడుచుంటి సితకీ
ర్తీ! కూర్మదేవ ప్రభూ 100

శా॥ మన్నీటన్ మునుగంగ వేద గిరులన్
మోయంగ నేఁ గోర: నో
యన్నా! భూమి భరింపఁ జెప్ప: మఱి యే
హ్యాంబైన రూపంబుఁ దా
ల్ప న్నిన్నున్ బనుపంగఁబో, నరుల, వే
డన్ గోర, లక్ష్మీధవా!
నన్నున్ బ్రేమఁ జూడు మంటిఁ గద కృ
ష్ణా! కూర్మదేవ ప్రభూ 1



శా॥ నిన్నున్ బంపను మూఢులౌ నధిపులన్
నిర్జింప, నేఁగోర నీ
యన్నన్ దమ్ముఁడు తోడుకాఁగ వనసీ
మావాసమున్ జేయఁగా,
వెన్నలి దొంగిలి తెమ్మనన్, జడతమై
భిక్షార్థిగాఁ, గల్కిగాఁ
బన్నింప న్నిను, జాలు నన్నుఁ గృపఁ బ్రో
వన్, గూర్మదేవ ప్రభూ 102

శా॥ నాకాధీశమునీంద్ర వందిత పదా!
నాగావళీ వంశధా
రా కూలంకష వల్ల భాంతరిత కూ
ర్మక్షేత్ర ప్రాంత స్థితి
న్నీకున్ దగ్గ జవాడఁ జూడు కరుణన్
శ్రీకాకుళంబే జని
త్స్నేకం బొటను నాకు, నీరజ దళా
క్షా! కూర్మదేవ ప్రభూ! 103

మ॥ వర కారుణ్యనిధీ! నిధీశశశి సం
పద్భవ్య ! భవ్యశ్రితా
మరకాఙ్క్షా చరణా! రణారిజన స
మ్యగ్భంగ! భంగప్రజే
తర సౌభాగ్యధృత పదా! పదాక్షీరిపునా
ధక్రాంత! క్రాంత వ్యధా
దురిత స్ఫారకథా! కథాకలితబం
ధూ! కూర్మదేవ ప్రభూ 104

మ॥ అవి తాహస్కర మాన! మానచయకాం
డాకార! కారవరిదే
శ విచిత్రోద్భవ వృత్త! వృత్తవరశ
శ్వ ద్దేహ! దేహ వ్యపో
హ విధా నాంచితకీర్తి! కీర్తిత కృపా
వ్యాపార! పారంగ తా
హావ వైదగ్ధ్య విశేష! శేష ఫణి త
ల్పా కూర్మదేవప్రభూ 105

మ॥ ఈ నా కావ్య తనూజ హ్మా లెపట్టిల
నీందరి. ప్రజస్తుత్యమై
పూనన్ జాలదు కీర్తి, బేల యనుచున్
బోనాడ కీకవ్య నం
తే నమ్మిన్ గృప నేల నీకుఁజను, భ
క్తిన్నిన్నులో నెంచుటన్
దీనన్ దేలెద మోదవార్ధిఁ బెలుచన్
శ్రీ కూర్మదేవ ప్రభూ 106

మ॥ వనమాలీ! యమలాపు రాన్వయుఁడనౌ
త్వద్దాస దాసుండ, మా
నిని మాణిక్యము పాళికిన్, వరదరా
ణ్ణో స్త్రాత్ముకున్ బుత్త్రిరుం
డ, నిలన్ భాస్కర రాయ నామకుఁడ, గీ
ర్లాలిత్య విద్భృత్యుఁడన్
వినతుల్ గైకొను మయ్య! నిర్మల కృపా
బ్ధీ! కూర్మదేవ ప్రభూ 107



మ॥ అదినాకిమ్మదియున్ భుజింతు నిడు మ
మ్మా! యంచు రోదించు నె
య్యది కన్పట్టిన! బుత్త్రకుండు కడు బా
ల్యంబందు, నైనన్ గృపా
స్పదచేతంబునఁ దల్లియిచ్చు నెపుడున్
బథ్యంబె; తద్రీతి నా
కెది కల్యాణదమో యెఱుంగు దొసఁగీ,
వే, కూర్మదేవ ప్రభూ 108

—: ఫలశ్రుతి :—

మ॥ శ్రుతి పేయంబును, బుణ్యదంబు, నలఘు
శ్లోక ప్రదంబౌట నీ
శతక శ్రేష్ఠము భక్తితోడఁ జదువన్,
సంపూర్ణ మాలింపఁగన్
సతమున్ మానవ బృంద మొందును మహా
సౌఖ్యంబులం ద్వత్కృపా
యత శీతేక్షణ సాధనంబున మహా
త్మా! కూర్మదేవ ప్రభూ 109

ఓమ్ తత్ సత్

సంపూర్ణము



శ్రీ గాయత్రీ ప్రెస్ – శ్రీకాకుళం.